సంపుటము 5] మే, 1919 [సంచిక 11

# బాలమిత్ర

## కీర్తన

చాయ: నూతన మిత్రుని అను రాగము

బేతలేమునియూర క్రీస్తేసుపుట్టెన్
పాపులకొరకై ప్రభుయేసుపుట్టెన్

1. గొర్రెలకాపర్లు మందలు మేపుచుండ
అంతలో నొక గొప్పవెలుగును గలిగెన్ ॥ బేతలే॥

2. అంతలో గొల్లలు విభ్రాంతినొందిరి
గాబ్రియేలను దూత వారి యెదుటనిలిచెన్ ॥ బేతలే॥

3. అప్పుడు దూత దావీదు పట్నమందు
మీకొక రక్షకుడు నేడు జన్మించెను ॥ బేతలే॥

4. పూర్వజ్ఞానులు నక్షత్రమును జూచి
క్రీస్తుకొరకై అర్పణను చెల్లించిరి. ॥ బేతలే॥

# ఒక యద్భుత పుస్తకము

సీతా, ప్రొద్దయినది. శీఘ్రముగ రమ్ము. పోదము అని గోపాలుఁడు తన చెల్లెలిని బిలిచెను.

“అన్నయా, ఇదిగో వచ్చుచున్నాను” అని చెప్పుచు సీత పరుగెత్తుకొని వచ్చెను.

“రామస్వామీ, ఉపాధ్యాయులు మనకోసరము బడితోఁట యందుఁ గనిపెట్టుకొనియుందురు. అది మర్యాదకాదు; త్వరగా రమ్ము” అని గోపాలుఁడు తన స్నేహితుని బిగ్గఱఁగాఁ బిలిచెను.

రెండు మూఁడు నిమిషములలోపల నీ ముప్పురును మాఁకుచు నాటలాడుకొనుచు బడివైపునకు వెళ్లిరి. సీత బడియందుఁ జేరపోయినను దన యన్నయగు గోపాలునివద్దఁ జదువను వ్రాయను నేర్చుకొనుట వాడుక. ప్రతి రాత్రియును వీరు దీపముదగ్గఱఁ గూరుచుండి తాము బడియందుఁ జదివిన పాఠములను గుఱించి వేడుకగా మాటలాడుకొనుచుందురు. ఉపాధ్యాయుఁడు వీరిని నాఁటి యుదయమున బడితోఁటకు రమ్మని నట్లు, గోపాలుఁడు ముందుదినము రాత్రి చెప్పుచుండెను.

అప్పుడు సీత తానును వారితోఁగూడ వచ్చెదనని చెప్పెను. కాఁబట్టి వీరు ముగ్గురును జేరి యిప్పుడు బడి దారిఁబట్టి వెళ్లిరి.

ఇట్లు పోవుచుండఁగా గోపాలుఁడు "సీతా, మా అయ్యవారు సోమయ్యపంతులు మరల నిప్పుడు బడికేల రమ్మనెనో తెలియునా? నిన్నటిదినము దానినిగుఱించి మాకుఁ జెప్పుచుండెను. అది మిక్కిలి వినోదముగా నుండెను."

సీత "ఏమి చెప్పిరి?"

గోపాలుఁడు "మేము నిన్న బడివిడిచి వచ్చుటకుముందు పంతులుగారు మమ్ముఁజూచి మీరిదివఱకును బడియందు చిన్న పుస్తకము లనేకములను జదువుచుంటిరి. మీరు మొట్టమొదట నక్షరములను నేర్చుకొని తరువాత సులభములగు పదములను నేర్చుకొంటిరి. అటుపిమ్మట కఠినపదములనుగూడ నేర్చుకొని యిప్పుడు మీ పుస్తకములను వేనినైనను జదువను వ్రాయను శక్తిఁగలవారైతిరి."

"ఐనను, మఱియొకవిధమగు పుస్తకము కలదు. దాని నిప్పుడు మీరు చదువ నారంభింపవలెను. ఆ పుస్తకము మిక్కిలి విస్తరమైనది. ఎవ్వరైనను ఎప్పుడైనను దానిని జదువవచ్చును. దానిలోని మొదలి పుటలు లెక్కకు మిక్కిలియైనవి. వాని నెంచు

టకు మనకు సాధ్యము కాదు. మీ రా పుస్తకము నెన్ని దినములు చదివినను విసుగు చెందరు. దానిని జదివెడి బాలురును, బాలికలును వేనవేలు కలరు. కాబట్టి మీరును దానిని జదువ యత్నింపవలెను" అని చెప్పెను.

అంతట నేను "అయ్యా, ఆ పుస్తక మెక్కడనున్నది? చాలదూరము పోయిననే దొరకునా? దానివెల యెంతయో? అని యడిగితిని."

దానికాతఁడు, 'ఒక కానియైనను సెలవు చేయక దానిని మనము చదువవచ్చును. ఈ యాశ్చర్యకరమగు పుస్తకమును దేవుఁడు మనకొఱకే సులభముగ నిచ్చియున్నాఁడు. దానిని లిఖించినవాఁడు నతఁడే. దానిని రచించినవాఁడు నతఁడే. మనము చదువవలయుననియే యతఁడట్లు చేసెను. ఆ పుస్తకము మనకు సమీపముననే యున్నది. మీరు చదువుటకొఱకే అది తెలుపఁబడి సిద్ధముగా నున్నది. మీకుఁ జుట్టుప్రక్కల నున్నవన్నియు నా పుస్తకమునందలి పుటలే. ఆకాశమేమి, జలమేమి, భూమియేమి, ఎగురునట్టి పక్షులేమి, భూమియందు సంచరించు మృగములేమి, చెట్టులేమి, ఇవియన్నియు దేవుని పుస్తకమునందలి యనేకములగు పుటలే. ఈ పుస్తకమును ప్రకృతిశాస్త్ర పుస్తకము అనియు, దానియందు మనము

చదువు పాఠములను ప్రకృతివిజ్ఞాన పాఠములనియుఁ జెప్పొదను.'

'బడియందుండు తోఁటను ఈ పుస్తకమునందలి యొకానొక పుట యనఁదగు. కోపటియుదయము మీ రిక్కడకు రండు. మనము దానినిఁ జదువఁ గడఁగుదము. మనము మొట్టమొదట కొంచెము కొంచెముగా దానియందలి విషయము నేర్చుకొందము' అనెను.

ఈ విధముగా గోపాలుఁడు సీతకుఁ జెప్పి ముగించఁగా, సీత "అన్నయ్యా, నాకుఁగూడ వీనిని నేర్చుకొనవలెనను నాశయున్నది. ప్రతిదినమును బడియందు నేర్పఁబడు (సైన్స్) ప్రకృతిశాస్త్ర పాఠములను గుఱించి మనము మాటలాడుకొనవలయును" అని చెప్పెను.

అప్పు డుపాధ్యాయుఁడు వారినిఁ జూచి "మొట్టమొదట మనము చెట్లనుగుఱించి కొన్ని విషయములను గ్రహింపఁ బ్రయత్నింతము. చెట్లయం దనేకవిధములు కలవు. అదిగోఁ జూడుఁడు, తోఁటకావల నొక పెద్దమఱ్ఱిచెట్టు కనఁబడుచున్నది. దానికే వృక్షరాజము (వృక్షము=చెట్టు) అని పేరు. మన కాలిదాపున గంగచెట్లున్నవి. పందిరిచుట్టు నల్లుకొని చిక్కుడుతీఁగ యున్నది. ఇవియన్నియు వృక్షవర్గమందు

(చెట్లజాతిలో) జేరినవే. ఐనను వీనియందొకటికొకటి కెంత భేదము కనుపట్టుచున్నదో చూడుఁడు" అనెను.

అప్పుడు సీత "అన్నయ్యా, చూచితివా, చెట్లలో నెన్ని విధములున్నవి. కొన్ని పెద్దవి; వృక్షములు. కొన్ని చిన్నవి; మొక్కలు. కొన్ని తీఁగలు" అని చెప్పెను.

ఉపాధ్యాయుడు: "ఔను, అమ్మాయీ, నీవు చెప్పునది నిజమే. ఇప్పుడొక వంగచెట్టును బెల్లగించి దానినిగురించి బాగుగ విచారింతము. రామస్వామీ, ఇదిగో, ఈ చెట్టు నూడఁబెఱుకుము, చూతము" అనెను.

రామస్వామి వంగి చేతులతోఁ బెఱుకఁ బ్రయత్నించెను కాని, సాధ్యముకాలేదు.

ఉపా: "రామస్వామీ, ఏల పీలుపడలేదు?"





# ఒక కుక్క కథ

ఒకానొకప్పుడు సీమదేశములో ఒక కుక్క యుండెను. దానిపేరు టాం. అది తన యజమానునియందు మిక్కిలి విశ్వాసముగలది. అది తన యజమానుని యిల్లు రాత్రులయందు కాపాడుచు మేకలను కాచుచుండెను. ఒక

సారి మేకలమందను పొలమునకు తోలుకొని వెళ్లి కాచు చుండగా రెండుమేకలు తప్పించుకొని పోయినవి. వాటికొరకు చాలదూరము ప్రయాసపడి తిరిగినప్పటికిని అవి కనబడలేదు. అది చాల దుఃఖముతో తక్కిన మేకలను తోలుకొని తన యజమానుని యింటికిరాగానే దాని యజమానుడు మేకలను చూచుకొని రెండుమేకలు ఎక్కడ ఉన్నవని ప్రశ్నించెను. అందు కా కుక్క ఎక్కడికో తప్పించుకొని పోయినవని ప్రత్యుత్తర మిచ్చెను.

అందుకు యజమానుడు చాల కోపపడి త్వరగా వాటిని వెదకి తోలుకొని రమ్మని చెప్పెను. అందు కది అయ్యా! నా పిల్లలు ఆకలిచే శ్రమపడుచున్నారు. నా బిడ్డలకు పాలు యిచ్చివచ్చెదనని మనవిచేసెను. అందుకు అతడు చాల కోప పడి వాటి రెంటిని వెదకి తోలుకొనిరమ్మని కోపముతో కసరి చెప్పెను. అందు కది తన యజమానుని పని నిమిత్తము బయలుదేరి మంచులో తడచుచు వాటిని వెదకి తోలుకొని వచ్చెను. అందుకు యజమానుడు చాల సంతోషించి త్వరగా యింటిలోనికి పోయి ఒక బంగారపు పట్టెడ తీసికొనివచ్చి దానిని మూడుపర్యాయములు పిలిచినప్పటికిని ప్రత్యుత్తర

నేమియు యివ్వలేదు. అతడు చాల ఆశ్చర్యపడి ఇదియేమని చూడగా అది చనిపోయి యుండెను. అందు కతడు చాల దుఃఖపడి దానికి సమాధిచేసెను. ఆ కుక్క తన యజమానుని పనినిమిత్తము తన ప్రాణముపెట్టెను.

ఆలాగే మనమును మన ప్రభువైన యేసు సువార్త నిమిత్తము మన ప్రాణములు పెట్టవలసియున్నది.

ఇట్లు

మీ ప్రియబాలమిత్రుడు

సి. హెచ్. అబ్రాహాము

పాములపాడు,

గుంటూరు తాలూకా

# ఆకులు

పిల్లలారా! ఇదిగో రెండాకులున్నవి; ఒకటి బాద మాకు. మఱొకటి జిల్లేడాకు. వీనిలోపల నేది యెక్కువ లావు?

“జిల్లేడాకే.”

“ఔను, దీనికంటె మందమైన యాకులుకూడ కొన్ని యున్నవి. ఈ కలబంద యాకును జూడుము.”

“ఔను, దీనిని నేను వెలుగులయందుఁ బలుమాఱు చూచి యున్నాను. దీనిని ఆక నే తలఁచలేదు; అంత ఘన ముగా నున్నది.”

“ఇది ఘనముగా నుండుటే కాదు. పశువులకు మంచి యాహారమగుటచేత గొఱ్ఱెలు దీనిని సులభముగా మేసివేయ వచ్చును. కాని, యవి దీనిని తాకుటకూడ లేదు. ఇదెందు చేతనో యని తెలిసికొనఁగోరితే, దీని యాకును జేతులతో నొత్తిపట్టు, చూతము.”

“పట్టుటకెట్లు వీలగును; ముండ్లు చేతికిఁ గ్రుచ్చుకొనవా? ఓహో! సరే. ఇప్పుడు తెలిసినది. ముండ్లుండుటచేత మేఁకలు దగ్గఱకు రావు కాఁబోలు. ఈ ఆకుల కీ ముండ్లాయుధముల వలె నున్నవి.”

“ఔను, ఇదిగో, ఈ యాకును జేతితో నెత్తఁగలవా?”

“దురదగొండి యాకు కదా యిది? దీనిని దాఁకితే దురదెత్తును” అని సీత బదులు చెప్పెను.

“సీతా, దీనినుండి దురదకలుగుటకు గారణము దీనిమీఁద నుండు నూనయే. కలబందమీద ముండ్లు పెద్దవిగా నున్నవి. దీనిమీద చిన్నవిగా రోమములవలె నున్నవి. ఈ రోమము లందు విషమున్నది; కాఁబట్టి మన శరీరమున కవి తగులఁగానే దురదపుట్టుచున్నది. ఇదిగో నుండెడి పరంగియాకును జూడుము. ఇదియు నటువంటిదే.”

“ఔను, దీనిమీఁదగూడ నూఁగున్నది. దీనివలననే కాఁబోలు ఈ యాకు, పురుగులు మొదలగునవి చేరకుండా నట్లు, కాపాడఁబడుచున్నది.”

"ఔను కాని, యీరీతి సొన యీ పనసాకుమీద నున్నదా?"

"లేదు. ఇది మిక్కిలి నున్నగా, నూనెపూసినట్లు మిన మినలాడుచున్నది."

"ఒక పలకకు నూనెపూసి దానిమీఁద నీళ్లుపోసినయెడల నెట్లానీరు దానిమీఁద నిలువక జాఱిపోవునో, అట్లే వర్షము కురియునపుడు జలము దీనిమీఁద నిలువకఁ గ్రిందఁ బడిపోవును; చెట్టుయొక్క వేళ్లకు నీరుపోసినట్లగును. తామరాకు పై ప్రక్కన నిట్లే యుండును. కాఁబట్టి దానిమీఁదఁ బను నువకము నిలువక యప్పుడే జాఱిపోవును" అనెను.

అప్పుడు సీత, "ఆకులకు ముండ్లును, నూఁగునుండుట పసువులును పురుగులును వానినిఁ దినివేయకుండుట కొఱకే కాఁబోలు. పనసాకులు మేకలకు నావులకు నందవు. కాఁబట్టి యవి మిసమిసలాడుచు నుండవచ్చును. నీ చేతిలో నుండెడి దేమి?"

"ఇది చివికిన మోదుగాకు. నీకుఁ జూపించుటకే దీనిని దెచ్చితిని. ఈ యాకులో ఈనెలుతప్ప తక్కిన పదార్థమం

తమయుఁ జివికిపోయినది. ఈనెలెట్లు వ్యాపించి యున్నవో చూడుము."



"ఈనెలడ్డమునకును నిలువునకును వ్యాపించి యొకటితో నొకటి యల్లుకొని వలవలె నున్నవి."

"ఔనా. ఈ జొన్నాకునందుఁగూడ నీనెలిట్లే యుండునా?"

"ఇట్లుండదు. దాని పెద్ద యీనెలన్నియు నిలువుగానే పాఁకి కట్టెలమోపునందు కట్టెలున్నరీతిగనే యుండును."

"మోదుగాకునందువలె నీనెలడ్డముగాను నిలువుగాను నల్లుకొనియుండిన 'వలయీనెయాకు' అని చెప్పవచ్చును. అట్లుకాక, జొన్నయాకువలె నీనెలు నిలువునకే వ్యాపించి యుండినయెడ 'నిలువీనెలయాకు' అని చెప్పవచ్చును."



"నేఁడు నేనాకులనుగూర్చి యనేక విషయములను నేర్చుకొంటిని. ఆకులన్నియు నొకే మందముగా లేవు. కొన్నిటి

మీఁద నూఁగు, ముండ్లు మొదలగునవి యున్నవి. కొన్ని యాకులు వలవలెనుండు నీనెలు కలిగియున్నవి. కొన్ని నిలువీనెలు కలిగియున్నవి" అని సీత చెప్పెను.



# బాలమిత్ర టపా




ప్రియ బాలమిత్రులారా!

నేను కొంత కాలమునుండి, "బాలమిత్ర" యను ఈ చిన్న పత్రికను చదువుచున్నందున, నా హృదయము సంత సాగరంబున మునిగినదనుటకు సందియములేదు. ఇంతియగాక నేను చాలాకాలమునుండి ఈ బాలమిత్ర టపా వ్రాసికొన

వలెనని కోరికతో యుంటిని. అయితే యిప్పుడు నా కోరిక నెరవేరినందుకు దేవునికి నిండా కృతజ్ఞత స్తుతులను చెల్లించుచున్నాను.

నేను ఇప్పుడు 1 ఫారము చీరాల బోర్డింగులో చదువుకొనుచున్నాను. మాకు ఇంగ్లీషు బాగుగా రావలెనని మా హెడ్ మాస్టరుగారు చాల ప్రయాసపడుచున్నారు. మాం తల్లిగారికి ఐదుగురు పిల్లలము. నేను రెండవవాడను. మా అక్కయ్య గుంటూరు బోర్డింగులో చదువుచున్నది. మా తండ్రి చనిపోయినాడు. నేను మీ యందరికొరకు ప్రార్థించుచున్నాను గనుక ప్రియమైన బాలమిత్రను చదువు బాలికా బాలురారా! మీ రందరు నన్నునుగురించి దేవుని ప్రార్థించవలెనని మిమ్మును వేడుకొనుచున్నాను.

ఇట్లు మీ ప్రియ బాలమిత్రుడు

వి. ఇస్సాకు సత్యనాథం

చీరాల

C. L. S. PRESS, MADRAS—1919